# స్వప్నకుమారము

రాయప్రోలు సుబ్బారావు

నవ్య సాహిత్య పరిషత్తు

గుంటూరు

# స్వప్నకుమారము

దోసెడు మల్లెమొగ్గల నధోముఖివై కొని తెచ్చితేల? బా
లా! సుమనోసురక్తల నయం బిటిలుండునె? తెచ్చినావుపో
వాసనజూడుమంచు బలవంతము జేయగనేల నన్ను? నా
యాసకరమ్ము లయ్యెడు సుహా! భవదీయవిచిత్ర వర్తనల్.

నిసి సగమాయె నిద్ర నవనీతమతీ! దెసలందు నెందు మా
నిసి చను జాడ లేదు, శయనించెగులాయములన్ శకుంతముల్
వ్యసనవిలీనరక్తి నమృతాంశుడుగూడ ప్రసూతజాతలా
లసలయి యున్న పుష్పవతులం జెఱబట్టగ రాదు దవ్వులన్. ౨

ధవళదుకూలకీలితనితంబము లాశల రాపువెట్ట బాం
ధవిహో! నిశీథమం దిటులు తారసిలం గత మేమి? సందియం
బవునుగదమ్మ! యీవరుస లామనితోటల, ప్రేమరోచిరు
త్సవ మగు మోమునెత్తి కలతల్ విడిపోవ ననుగ్రహింపవే.

శశి నుదాసించు నీ శుభాస్యమున కేల
జాఱు ముసుగు గీలించితో చనవులాడి!
కటికిచీకటి పడి తేట చిటులు ననియొ?
లలిత సౌందర్య రాజ్య మలభ్యమనియొ? ౪

# స్వప్న కుమారము

చదలు వెన్నెలల్ జల్లుచున్నది, కుమార
చాపలము లేదు పవనసంచాలనమున,
దరుల దన్నెడి కోనేటి కెరటములను
శ్రావ్యమేళన శ్రుతి వినరాదు రమణి! ౧

తలపగు వ్రాలునట్టుల నితంబిని! తారక లూగుచున్న వా
వలి మొగమేల పెట్టెను, ప్రపన్నుడ గన్నుల ప్రేముడింపు, మ
గ్గలమగు విస్మయవ్యధలు కాల్చుచునున్నవి! నమ్మవేని పూ
వులుగల చెట్లక్రింద మధువుం జవి జూచుచు బాస జేసెదన్.

ముసుగు సడలించి, తూరుపు
దెస నరసెద వేటికో ముదిత! యార్తిమలీ
మసుని గటాక్షింపుము, ప్రే
మ సరళ మగు నాడుదాని మన సగపడగన్. ౨

వలచిన ప్రాణవల్లభు డెవండొ యినన్ బ్రతిమాల వచ్చితో?
నిలుపగరాని కాంక్ష నవనీతదయాగుణశాలి నొక్కనిన్
బిలిచితొ యీ వనమ్మునకు? బింబఫలాధర! యర్ధరాత్రి వే
ళల నిదురించువీణ లిటులం గదలించితి వేల గోలవై? ౩

పువ్వులను గోయగ వచ్చితో ?
నవకపు టంటుల హరింప నడయాడెదొ ! ప్రా
భవశాలిని ! యేకతమ ని
టు విశాలములయిన తోట డొంకల కేలన్. ౯

వ్రాలినసంజలం జిగురువాఱిన మోహము పిక్కటిల్లగా
సోలి, వియోగశాంతి రుచిసూడగ వచ్చితొ? యిచ్చకాలయిం
తీ! లవలీకుమారకమనీయము లైన వనాంతరమ్ములన్
శాలకు లుండరంచును బ్రమాదమునంబడి తెంతదానవో! ౧౦

మొగము జూపక మూగనోమును వహించి
కఠినసంశయముల నొత్తి కత్తిరింతె ?
ఒరుల కన్నుల బడకుండ సురిగివచ్చి
తేమి యభిలాష గొని రమణీమతల్లి ! ౧౧

పూలు గ్రుచ్చిన సంపూర్ణ పుణ్యశీల
వేని, ననుజూచి ప్రేమింపు మిందువదన !
మాలికలు త్రెంచిన యభాగ్యురాల వేని
రమ్ము పోద మీ హతమనోరథుని తోడ. ౧౨

## స్వప్నకుమారము

హృదయసౌభాగ్య మేల దాచెదవో యింక
లేదు మతి కొక్క దైవము లేమ! వినుము
అన్యు లరయంగజాలని యాడుదాని
ప్రాణకాంక్షల కేని ప్రమాణ మగుదు. ౧౩

కన్యవో? కళత్రమవో? యెఱుగను మృగాక్షి!
చిరమనోవ్యాధివశ మయి చివికి చివికి
నవయు నను జూసి లేపి తానందముగను,
దాన గాంక్షింతు 'సాప్తపదీనమైత్రి'. ౧౪

శిథిలితాశాకిరణ మొందు చిత్తవీథి
నస్తమింపక భ్రమియింప నడలు చుంటి;
ప్రియుల కందఱ కతిదూరమయి, ప్రవాస
ఖేదమున దివసములు లెక్కించుకొనుచు. ౧౫

చింతాపుష్పము లేఱుచు
గాంతా! ప్రణయోపవాసకవ్రతినై యే
కాంత మనోహింస ననుభ
వింతు నిరర్థకపు గామవృక్షము పొంతఁ. ౧౬

స్నాయురుచ్ఛేద మయిన కష్టమ్ము నందు
మధురసుఖము నాస్వాదించు శిథిలహృదయు
లెవరో ? వారల కంజలి నిడుదు పడతి !
వినగలారు వారె మదీయ విఫలగీతి. ౧౪

మనసును వెన్నబోలె సుకుమారముగా గరగింపజాలి మో
హానమును ప్రేమభాగ్యసుఖమందగ నోచిన ధన్యురాల వౌ
దె నెలత! యొక్కమాట వచియించి కృతార్థుని జేయువమ్మ చా
లని యురిత్రాళ్ళ నేటికి గళాన బిగించెదు సంశయమ్ములన్.

చేతిమీదుగా ద్రవ్విన చిన్నిసరసి
మునిగి తేల కదృశ్యుడౌ పుణ్యు డెవడొ ?
యిసుకపడి పూడిపోయిన నేడ్వబోడు,
తావలు తమ్ములు లేవని దుఃఖపడడు. ౧౫

చెలియాపూయగరానిపూపొదనుబూచెంగ్రొత్తపుష్పమ్ము, మా
పుల నీరెత్తెడి ముగ్ధు డొక్కడు తలంపుల్ నిల్పె నా మొగ్గపై,
చెలువమ్మున్ వలపుక్ తదాదిగ వృథా జీర్ణించి జీర్ణించి శో
షిలి శాంతింపగ నున్న, వేమిగలదో చెప్పంగ బ్రేమావధిన్.

# స్వప్నకుమారము

మొగ్గగట్టిన తొలికారు మోజు సయిచి,
రేకులెత్తిన మోహనఋతువు గడపి,
కుసుమదశ కయి యుత్కంఠ గొనిన యూర్పు
తుది గృశించెడి నిట్టూర్పు తోనె యిటుల. ౨౧

చేయి కడగంటి కడ్డము జేసి, చూపు
సైగలిచ్చి లాలించిన చంచలాక్షి,
భ్రాంతి నల్లాడ ద్రోసి మార్గమ్ము మార్చె;
ఛిన్నహృదయుల కేటి వాంఛితము లతివ! ౨౨

కడుపునగన్న తల్లితమకమ్ము శమించునుగాక కొంత, యె
క్కుడయిన దత్తకాంక్ష కొడుకో! కొడుకో! యని ప్రాణమంతయు
న్విడిచిన మోహపుంజనని ప్రేమయు శేబరమౌనుగాక, క
ట్టడి ప్రియురాలి రాగ మకటా! కటువౌనె కుమారుపాలిటన్.

ప్రణయశైథిల్యతీవ్రతాపమున కేల
బలవదనుతాప బాధ తోడ్పడెదు పడతి?
గాయములు లేని నెత్తురు గడ్డ లయిన
ఈవగపు గంటు లెటు శమియింపగలవు? ౨౪

కామ్యకుసుమముల్ పూచు సంకల్పలతలు
కడు బలాత్కారముగ త్రెంపబడియె విధిని,
ఇక నిరాశానిదాఘ మాఱక జ్వలించి
ముగుద! వాడింపవలయు సమూలముగను. ౨౫

కన్నెవిరులు సమర్త్తాడు కాలమందు
గొసరి గొసరి పాటలు పాడు కోకిలంబు,
కొమ్మ లనురాగరజ్జులు కుత్తుకలకు
బెనచుకొని స్రుక్కు వేళ గన్పింపదేమొ? ౨౬

కందళించు కాంతిపూతరంగముల దేల్చి
పరవశ మొనర్చు నభిమతప్రాప్తి నెంచి,
బాష్పముక్తాళి నర్పింతు ప్రణయదేవి
నీ వనాంతరమందు నిందీవరాక్షి! ౨౭

సిగ్గును జిన్నరికము వెను
మొగ్గగ, బాలివోని స్నేహమోహనదశలఁ
ప్రగ్గుచు, జేతికి నోటికి
నెగ్గెఱుగని చెలుము లేమి యితరము లరయుఁ. ౨౮

# స్వప్న కుమారము

ఇంటిలోని పూజ్యుల నెల్ల నేమరించి
వెలుగు దీపిక నార్పితిమి లలితాంగి!
ప్రణయరేఖయు, నాశాకిరణము నంత
కటికి చీకట్లపాలయి కానరావు! ౨౯

హృదయము పరితుష్టం బయినది లతాంగి!
భావ మపరితుష్టముగ గాపాడికొంటి,
దైవమును బ్రసన్నుని జేయ దగును గాక
దోషమతుల నమ్మించుట దుర్లభంబు. ౩౦

చవితి నెలవంక యయ్యె నాసకియ చెలిమి
రాగశుకము పీడాపంజరమున బడియె,
భావగీతము నిక రచింపంగ నేమొ?
చెప్పు సకియయు, పాడెడు చిలుక లేక. ౩౧

వలపుదీపుల నైన, నెవ్వాగల నైన,
వ్రతనిరతి నైన, బ్రణయప్రపత్తి నైన,
నీ కుమారదీనునితోడ నించు కంత
పాలు పంచికో గల వేని పలుకు మబల! ౩౨

ఆస దీఱక క్షోభించు ప్రాణివితతి
శూన్యసంబంధ మాశ్రయించుట యఘంబు,
తుల్యరక్తి, తుల్యావస్థ, తుల్యదశల,
నొక డయిన లేక పొసగ దన్యోన్యమైత్రి. 33

నింగి విసరిన గొడిసెల రంగుబెడ్డ
బోలె వ్రాలెడు చక్కదనాల చుక్క,
అకులీనలు నారాగ మాలకించి
వంశముల నిచ్చు దీర్ఘనిశ్వాస మదిగొ. 3౪

గగననికేతనమ్ముపయి గప్పిన తెల్లని పాలపెంకు ల
ట్లగపడు శ్వేతమేఘశకలావళి జూడుము, కప్పు జీరువా
ఱగ దిగియున్న చీకటి తెరల్ పెడ కేగెడు నింక జాములో,
సుగుణవతీ! సుధాకిరణసూత్రధరుం డుదయించు నీ దెసన్.

అనుటయు నా చెలువ తటా
లున నులికిపడి భ్రమతో నలుగడల నెదియొ
కను లెత్తిచూచుచును గద
లెను నా దండ విడిపించి లేగవు నడలన్. 3౬

మదవ దళిపుత్రు మేల్కొల్పు మధుసుగంధ
మవల నాతని చెఱకు బా లవు విధాన,
నన్ను లేపిన యాకాంత తన్ను విడక
తగులు నా నీడబెడదకు దప్పదయ్యో. ౩౭

అవశమయి జీర్ణహృదయము
మిపులు నగమ్యంపు దమిని, మెల మెల్లన నా
చివురాకుబోణి యడుగుల
గవయంబోయి యిటులంటి గద్గద ఘనోక్తి. ౩౮

అదరు చరణమ్ముల నటించు నందెరవళి
పులుగు పొలతుల నెల్ల మేల్కొలుప గలదు ;
వలదు! వల దేమిటికి తొట్రుపాటు గదుర
నడల బెనబడె దుపవనాంతమున నింతి ? ౩౯

దవ్వవలె నార్ద్రమయిన చిత్తమ్ము నబల!
ఆస లనెడి ఆ మెత్తని పొర లల్లి కొనియె,
ఋతుహితము గామి విప్పార వింతవఱకు
తిన్నగా దీసి పొమ్ము నీ పున్నె మగును. ౪౦

అపుడపుడే గానబడె దూ
రపుదెస బొడుపొందు చందురుని రేకలు నా
చపలాయతాక్షితో నా
యుపలాపము ముగియు సరికె యవ్యవహితమై. ౪౧

పది బాఱల దూరం బు
న్నది యామెకు నాకు నడుమ, నాఱుమడులకై
కదలికల బోవు సోనయు గ
లను పచ్చనిమొక్క లొడ్డులను జెలువారన్. ౪౨

మసకమసక వెన్నెల తెల్ల మైల బాసి
యంతకంతకు దెరదీసె నాకసమున,
చూడ గలిగితి నంతట చోద్యముగను
నా వెలది వాలకము మనోహరము గాగ. ౪౩

కెలకుల బాఱుచున్న కులికింపుసోనంగడకంట జూచుచున్
తొలకరిపూత బూచిన మనోజ్ఞపు దీవల పూలు గిల్లికొం,
చలసగతిన్ విలాస మొలయన్ మెలమెల్లన బోయె బిల్చినం
బలుకక యా శుభాంగి తలవంచి ముసుంగులుజాఱ నీడ్చుచున్.

# స్వప్నకుమారము

ఒక పెడకు వ్రాలు శిరసును
చకితపు టొడుపులు వెలార్చు జాణనడకలుఁ
ముకుళములు గిల్లు సొగసును,
తెకతెక లాడించె నన్ను తీవరపు దమిఁ. ౪౫

కాంతరూపమె రసవదాకర్షణంబు,
అందు సంవృతశృంగారముం దొలంకు
ముద్దువేస మత్యంత సమ్మోహనంబు,
కృష్ణనిశల సాంగత్య మిం కేమి చెప్ప! ౪౬

ఆసలెల్ల గ్రీష్మ ప్రవాహముల పగిది
సన్నగిల్ల శోషిలిన నాస్వాంతభూమి,
రాగమృగతృష్ణ లడరి యారాటపెట్ట
బగిలె పాపపుణ్యైకవాటపటుయుగళి. ౪౭

దెసలు శూన్యమ్ములయి, శూన్యదీప మయిన
పారవశ్య సాగరమున బడిన యెడద,
మోహ మనెడి సూచీయంత్రమునకు జిక్కి
యెట్లు త్రిప్పిన తిరుగు తా నట్లు బళిర! ౪౮

కన్నమమతను, గన్నుల గన్నకాంతు
గలుగు నెడబాటుగొడ్డంద్రు నఱకివేయ,
కటు మనోహింస పాలయి కలగు నన్ను,
కేరె ననిమిత్తకరుణ నే స్నిగ్ధహృదయ. ౨౯

ఆదయావతి సహవాస మాస గొంటి
విషయచాపలవశమైన వికలబుద్ధి,
ప్రకృతి గర్భోదయుం డయ్యు భ్రమను బురుషు
డకట! యెంతటి యవివేకి ప్రకృతిపట్ల. ౩౦

కొంత దూరముపోయి యాకాంత నిలిచె
నీడజూచి భ్రమించిన లేడివోలె,
అంతలో జేర నరిగి జంకింత లేక
ముసుగు చెఱగుగైకొంటి గాబోలు నేను. ౩౧

చెలియ ముసుంగుదీసి దయసేయకుగాని మొగమ్ము, ప్రేమలీ
లలుగలదానివోలె "నిటులన్ ననునేటికి వెంటనంట? జర
చలమతి! రాగభోగసరసమ్ములకున్ వెలియైననీకు నే
ఫలమురుచించు" నంచు కలవాణి బయల్పడ బల్కెనింపుగన్.

# స్వ ప్న కు మా ర ము

నడిరేయి నా చెఱుదముల
కెడదఁ గలుషింప, కార్ద్రహృదయపు సరణిఁ
నుడివిన యాయమ గనుగొని
పడతీ! మోమిచ్చి పలుకవలదో యంటిఁ. ౫౩

అనుటయు నించుక తాపము
వినబడ వచియించె నిట్లు, "ప్రియశీలుడ! యే
మనవచ్చు నీదు కోరిక
మన సీయక మోమునిచ్చు మలినలు కలరే." ౫౪

పూలు పూయింతు సంపూర్ణముగను; గాని
గ్రుచ్చు భాగ్యముఁ ద్రెంచెడు ఘోష గూడ
గాంచుచుందును కడు ననుకంపతోడ
నచటచట నిన్ను బోలువా రనుభవింప. ౫౫

నాటకయి శ్రుతి యయిన వీణాసజీవ
తంత్రు లానందభైరవిఁ దనుప గలవె?
జీర్ణకుసుమసన్నిధి రుచించిన విదగ్ధు
నకు, ప్రసూతశోభన మేమిటికి దలంప. ౫౬

పూలబిడ్డల బ్రీతి నుయ్యాల లూచు
పవను డెఱుఁగడు తొడిమలు వదలు ననుచు,
తలపులకు విరుద్ధము లైన ఫలితములకు
బాధ్యులెవ్వరో? పుణ్యపాపమ్ము లేవొ? ౫౮

నవకము క్రుంగిపో బ్రియమునఁ బ్రసవించు భరమ్ము మాత్రమే
లవలికవంతుగాక, యవలఁ దెదనూన సుమమ్ము లాప్తబాం
ధవిజడ నందగించునో? వృథాపడిపోవునో! దేవపూజ పాల
వునో? యెఱుంగజాలదు, రహస్యము లిట్టివెసుమ్ము సృష్టిలోన్.

పిలిచి బతిమాలి పాలీయ గలను గాని
పాలు గొనుటకు నే యోగ్యురాల గాను,
ఆప్తు లంపిన వా రుపాయనము నీకు
స్వీకరింపు మీ మధుపాత్ర చిన్నవాడ! ౫౯

అనుచు ముసు గెడబోవంగ హస్త మింత
చాచి యందిచ్చె నా కొక్క స్వర్ణపాత్ర,
తీసికొంటి నేనును గ్రొత్త యాస లెత్త
నంతయు నపస్మారమయ్యె నొక్కింతలోన. ౬౦

## స్వప్నకుమారము

చూచుచుండియు గన్నులు చూడవయ్యె,
తలచుచుండియు దలపులు తలచవయ్యె,
పరమ శూన్యం బయిన యా యవస్థయందు
బట్టికొంటి దృశ్యాదృశ్యభావ మొకటి. ౬౧

క్షీణచంద్రికలను బ్రకాశించు రేయి
నాకు కాటుక పూసెనో నాగ దోచె:
మెఱపు మెఱసిన ట్లైన వెల్తురున గంటి
నడుగులు గదిల్చి పోవుచున్నట్లు సతిని. ౬౨

అపు డెదియు దోపని మనస్సు నాప లేక
నుఱల దరియంగ బోయి, కోమలికరంబు
నొడిసి గైకొని యిట్లంటి సుడియు వగల
"కనుల యెదుట నిరాశచే గాల్ప దగునె?" ౬౩

కాని యాసారి గూడ నా కావరమున
కాదరమె శిక్షగా నవ్వ చా శుభాంగి,
"కనుల యెదుట నారూపమ్ము కష్టమేని
అవలబోయెద సుఖముండు" మని వచించె. ౬౪

ఐనను మదీయచాపల్య మడగ దయ్యె,
చెలువ ముఖబింబమందు దృష్టిని లగించి
"నీ హృదయలీను జేసి మన్నింపు" మంటి
మఱల, చరణార్చన మొనర్చు మనసుతోడ. ౬౫

అంతట శుభాస్య యనసూయ యగుచు వింత
లాలసము నన్ను లాలింప "తాళు మిపుడు
మంచిసమయము కాదు కుమార!" యనుచు
తిన్నగాబల్కి చేయి విదిల్చి చనియె. ౬౬

హృదయమందు, వనంబందు, బొదలయందు,
నాకసంబందు, భువియందు, నాశలందు,
తారలందు నిశ్శబ్దమే తాండవించె;
ప్రకృతి ధ్యానస్తిమిత యైన పగిది నపుడు. ౬౭

చీమ చిటుకుమన్నను చెవుల్ చీలిపోవు
తతనిరాకులసమ్మూర్ఛ దనరె నపుడు,
వినబడియె నాతిదూరాన విస్ఫుటముగ
జలము పాయలిచ్చు ప్రపాతశబ్ద మొకటి. ౬౮

## స్వప్నకుమారము

వెలుగేది కిశారణ్యము
దలపించిన నాదు భావతలి నపుడపుడే
మొలకెత్తగ దొడగెను, స్మృతి
బలకిరణము లల్లనల్ల వ్యక్తి యొసంగెన్. ౬౯

మఱలం గానగవచ్చె నాదు ప్రణయమ్లానాశ్రునేత్రాళికిన్
జిరమాంగల్యములై, సదాపరిచయస్నేహప్రదీపమ్ములై
తరుణచ్ఛాయలతో వనస్పతులు, సొంతంబాఱు క్రొవ్వాకయున్
సరసాలాడుచునుండె వెన్నెలలతో శైత్యసాకల్యమై.

వనకుమారిక లుంచిన పసుపుముద్ద
లో యనగ నాకు మఱుగున సోయగించు
పండ్లు గనబడె మఱల నెప్పటి విధాన
దీయ నారింజ పాదుల చాయలందు. ౭౧

చెంపకు వంగిన సీతాఫలపు చెట్ల
కెత్తు బెట్టిన యూపు లిడు వెదుళ్ళు,
చేమంతి మడి కమర్చిన త్రాటితూముల
కడ బెల్లగిలిన చక్కని కుదుళ్ళు,

దొరువు క్రీదరికి బొందుగ వ్రాలి నీటిము
త్యాలపూజలు సేయు దబ్బయంట్లు,
ఇఱుకైన కంచెల నోరయు కాలువగట్ల
మువ్వ లేయు ననంటిమొక్క చాళ్ళు,
నచ్చ టచ్చట మునుపటియట్లె దోచె,
వెన్నెలలు గూడ గనులకు విశదమయ్యె,
పరిచయకులాయ మెడలిన పావురమ్ము
పగిది నామదియును వచ్చె వనికి మఱల. ౨౧

శావలెనంచుగోరిన యొకానొక పచ్చని నిమ్మపండు, చెం
గావిపయంటకొంగు లెడగా బడ పందిలి నెక్కి కోసి లీ
లావతి నాకొసంగినటులన్ పలుస్వప్నము లెందు గంటినో
యావిషమప్రదేశము కటా! తిలకించితిబో పునర్వ్యథన్. ౨౩

చదువులపాలవెల్లి, వికసన్నయవల్లి, యనుంగుచెల్లి, శా
రదవలె భృంగగీతలను రాగముతో బఠియింప, బిన్నియుం
గదలక యాలకించెడు వగల్ తలపోసితి నెందునిల్చి యా
శోదమవనమ్మునం, దచటకుం బరువెత్తె మనమ్ము క్రమ్మఱన్.

# స్వప్నకుమారము

కుచ్చుపిట్టలు బంగారు పిచ్చుకలును
వచ్చి పాటలు పాడున్ పిచ్చివగల,
తెచ్చి ప్రేలాడదీసిన తృణకులాయ
పజ్జ ఎక్కడి వక్కడే వఱలుచుండె. ౨౫

కాని యేవంక వెదకిన్ గానరాదు
నాదు హృదయముతోఁ పాటు వేదనయును
మేలు కొలిపిన యాచిత్రశీల యకట!
కటకటం బడితిని దైవఘటన నెంచి. ౨౬.

మర్మమార్దవనిర్దహ్యమాన మయ్యె
గ్రమ్మఱ యథామనోవ్యథా కర్కశార్తి;
అలలు రేగిన తామర కొలను మాద్రి
నెడద త్రెక్కొన నుత్కంఠ వెడలె నిట్లు. ౨౭

శ్యామా! శ్యామలతామలమ్మగు ప్రవాసస్నాన పుణ్యోదక
శ్రీమద్వాటికలన్, వియోగపదవీచింతారహస్యార్థినై,
ప్రేమారాధనమాచరింతు, లలితార్తిస్వేదలీలాదశల్,
కౌమారార్పణమంచు, బాష్పకణముక్తామాలికం ద్రిప్పుచున్.

ఎవరు లేని గవాక్షసంవృతతలాన
నను బిలచి బంధమేసె సుందరి యొకర్తు
తెల్ల సురపొన్న పూలసంకెళ్ళతోడ,
నిందులకు దైవ మొకడె యదృష్టసాక్షి. ౭౯

చేతిలో జేయినైచి నన్ జెప్పు మనియె
తీయని వెలుంగుతో "నివి త్రెంప ననుచు",
త్రెంచలే నెట్టులో సహించు వాడ
సన్నగిల్లు హస్తమునుండి జాఱుదాక. ౮౦

వలపుల జెమ్మగిల్లిన స్వభావముతో నభివానచేల మిం
పొలయగ గప్పికొన్న ప్రణయున్ భ్రమపెట్టితి విం తెకాని యో
కలికి! వియోగవహ్ని కణికల్ దహియించిన ప్రేమభస్మమం
దెలసిన యా యదృష్టలిపి నింత పఠింపకపోయి తక్కటా! ౮౧

భ్రమసి యారాటపడిన క్రొవ్వాడివలపు
లెపు డతీవదురాపవికృతము లయ్యె,
నపుడె సుఖదుఃఖసూత్ర మవ్యవహితముగ
భావగతుల బంధించె భామావతంస! ౮౨

# స్వప్న కుమారము

అది మొద లీవివిక్తతలమందు మదీయ కవోష్ణబాష్పముల్
తుది సికతాపగాజలముతో గలియన్ విడిపించు, చూరుపుల్
మృదులసుగంధవాతముల నేకముజేయుచు, నిష్ప్రమోదసం
పదల నెఱుంగువాడ సహవాసులదుఃఖము పంచుకొన్ వగన్.

చపలచపలమ్మయై యథాస్థాయి గనని
మదికి కైవల్యభోగ సంపద ఘటించె
నే మనోహరలలనాభిరామబింబ,
మా విలాస మారాధించు టఘమె? యతివ! ౨౮

ఆవర్చస్విని ముద్దుమోముపయి తీయమ్మైన లజ్జాలతల్
పూవుల్పూయ, బిసాళినవ్వుచిగిరింపుల్ నిగ్గుచెక్కిళ్లపై
గోవల్ దీయ, రహఃప్రదేశమున నాకు న్నేరిపెం బ్రేమవీ
ణావాద మ్మది మాన నేమిటికి, సౌందర్యార్చనల్ దోసమా!

ఏకాగ్రస్థాయికి మది
నాకర్షించెను మనోహరానందము నే
లా కాంక్షింపగ రా? దిం
తీ! కామ్యవ్రతము లంత నింద్యము లగునే! ౨౯

అనుచును వివిక్తతలి దెస లరయ లేక
తిరుగు ననపత్యహరిణంబు కరణి నేను,
చూచుచుంటిని యామెకై ; శూన్యమయిన
ప్రకృతి యాత్మగతి కనుబింబన మొనర్ప. ౮౭

మిసమిస లెసంగు మెత్తని యిసుక మీద
జంద్ర కిరణముల్ జెరలాడు సమయమందు
బలుకరించె శీతాశోక చిలుక యొకటి ;
వెంటనే వినబడె నొక్క వెలదివాణి. ౮౮

మౌక్తికముల కానుపు మోయు శుక్తి కకట!
గర్భవిచ్ఛేద మే పాపకారణంబు ?
పక్వఫలములు గన్న రంభలకు నేల
తప్పదు సమూలనాశనత్వము కుమార ! ౮౯

కారుచీకట్లు లోకముఁ గప్పె ననుచు
నేల నిందించెదవు మేఘజాలములను ?
చూడగలవు గదోయి మంజులము లయిన
చారుచపలాలతల, నింద్రచాపరుచుల. ౯౦

## స్వప్న కుమారము

శ్రావణపయోదబాష్పధారాభరంబు
నెమిలి కన్నియలకు దర్శనీయ మేని,
ఆకుపచ్చ కోకలబుటు వననికేని,
ఏడ్పు గూడ బ్రియంబు గాదేమి పుత్ర! ౧

చెఱిపిన మాసిపోని లిపిచే లిఖియించె రహస్య పంక్తి నే
ముఱిపెపుబొమ్మ నీహృదయపుస్తక మందున; నా యమూల్యసుం
దరపుట జించి గైకొనిరి తస్కరులెవ్వరొ ? వారి రోయ కీ
చెఱ కిటు లీవు పాల్పడెదిసీ ! యనిమిత్తవికారశాలివై. ౨

దప్పిగొని చేరిన మిళింద తనయులకును
బూలపాలిచ్చి చీకట్ల బోవకుండ
గడుపులో దాచుకొనదె పంకజము ప్రియుడ!
చేర దీసిన మమకార మేరి కెఱుక. ౩

గండ్రగొడ్డలిచే నఱకంగ దరియు
నిర్దయునకు జల్లని నీడనే యొసంగు
ఫలవదార్ద్రధాత్రీజాతములు కుమార!
ఇంత యాశ్రయ వాత్సల్య మేమి తెలియ? ౪

## స్వప్నకుమారము

పొదుగు నొవ్వంగ బాధించు ముద్దులేగ
నొడలు నాకెడి గోసాధ్వి యోర్ప దెంతొ!
బాధ సహించిన గాని స్వాదు వయిన
ప్రేమ మాధుర్యము రుచింప దేమొ పుత్ర! ౯౫

మాయపొరలు వీడిన సుకుమార శిశువు
నోరు దెఱచి యేడ్చెడిని యెందులకొ గాని?
అంపకపు బెండ్లికూతు గన్నార జూచి
నిలుపలే దేమిటికి దల్లి నిండు టేడ్పు? ౬౯

పడకటిలు జూచి యేడ్చు జవ్వని యొకర్తు,
చనినపసి జూచి యేడ్చు జనని యొకర్తు,
తనసొగసు జూచి యేడ్చు సుందరి యొకర్తు,
ఏడుపు బ్రియమ్ముగా వచియింప రేమొ? ౯౭

ఎండలో వాడిపోవు లేఁజిగురు లరసి
యేడ్చు నముల ప్రేమోదంత మెవ్వ డెఱుగు?
నీటితరగల రేల్బవల్ నృత్యమాడు
చంద్రసూర్యులు గూడ నాజాడ గనరు. ౯౮

## స్వప్న కుమారము

కార్శ్య సకలంకి యగు సుధాకరు డొసంగు
చంద్రికల నేమి కలుషదోషములు కలవు?
నిండుటేళ్ల జలంబు నిందింతు వోయి
తేఱిపాఱ దటంచు గుమారవాళి! ౯౯

విషరదన లైన త్రాచుగుబ్బెతల నేల
నయనసమ్మోహనాంగసుందరుల జేసె?
మధురగానవిలీనమౌ మంజుహృదియు,
శిరసురతనము లే పుణ్యవరము లిచ్చె? ౧౦౦

క్షణిక మం చెఱింగియును దిక్చక్రకంఠ
సూత్ర మగు నింద్రచాపముఁ జూడకుండె?
ఉన్నతస్వర్గ సోపాన యోగకాంతు
లప్పుడైన నంకుర మగు నంతె చాలు. ౧౦౧

తుమ్మెదలు గ్రక్కె ననుచు మధువు ద్యజించు
భావము విరక్తి కాంబోదు పడుచువాడ!
జలము మలినము లగుట నైజంబ యేని.
ఏల యవిభాజ్యబుద్ధి నూహింపలేరు? ౧౦౨

కోమల ప్రేమ సంపూర్ణకుసుమదశల
నలరు నప్పుడె దుఃఖరజస్సు క్షాలన మగును;
వర్షధారల గడుగంగబడిన పొలమె
యార్ద్రమయి పచ్చబడు నంచు నరయలేరె? ౧౦౩

ఎంతకామింతొ దుఃఖంతు వంతచేయు
ఎంత దీపమొ నీడయు నంతకాదె;
పరిమితియును సంబంధంబు సరిసమంబె
ప్రేమపెంచు నేమపు నింక విడువనేల? ౧౦౪

ప్రణయసౌభాగ్యవిరహభార ప్రసన్న
మయిన నీయాత్మ గోల కాతియపడంగ!
అనుభవింపు ప్రేమోచ్ఛిష్టమును కుమార!
అంటు లేదని నీయాప్తు లంపినారు. ౧౦౫

భావ మొకచోట నిలువ బూబంద మేసె
నేమనోహరి, యాకన్నె మోము జూచి,
స్వరము నాలించి, ప్రేమ కంజలియొసంగు,
మెల్ల ప్రాణులకాప్తుడ నేయటంచు. ౧౦౬

# స్వప్న కుమారము

ప్రకృతి యెల్ల ప్రవాసచారము భరించు
నిత్యకళ్యాణపీఠసాన్నిధ్య మెడలి,
చిరవియోగ సమ్మేళన శ్రీ లెఱుంగ
నీవును ప్రవాసివై కదోయీ కుమార ! ౧౦౭

కరతలీచిత్ర మగు సూత్ర మరసి పుత్ర!
కుసుమములు తెచ్చితిని దండ గ్రుచ్చుమనుచు,
ననెడి పలుకు క్రమక్రమా యత్తమాంద్య
లీనమైపోయె, బక్షిబాలికలు కూసె. ౧౦౮

అంత నాలోన నొక వింతకాంతి గంటి,
శిరసు నువ్వి జాఱెడి మాతృకరము మూడ్కి
నెదియొ! చల్లని స్పృహ యొకం డుదయ మయ్యె
నవల గనుతెత్తి తూరుపు టాశ జూడ. ౧౦౯

చేయుతలాడ జేసికొని, చెమ్మట గ్రమ్మెడి నవ్వుమోముతో
నాయెడ నాకుపచ్చనిశయానమునందున బవ్వళించి, పా
లీయ ప్రసన్నయైన జనయిత్రి యొకర్తుక నోచె నంత, న
న్నా! యని కౌగిలించితిని యాయమకంఠము బాలుపోలికన్.

